# జిందా తిలిస్మాత్

౫౦౦ రూపాయిలు ఇనాము ఈక్రింది వ్యాధుల కుపయోగ పడదనిచూపిన వారి కీరూపాయిలు బహుమానముగా యివ్వగలము. కడుపునొప్పి, కలరా, జ్వరము, దగ్గు, ఉబ్బసము, రక్తభేదులు, పాము విషయము తేలుకుట్టు యిన్ని వ్యాధులను కుదుర్చును. వెల సం॥ ౧ టికి ౦॥ ౧, సం॥ ౨ అ॥ ౭ 3 అ॥ ౯.

నోటు:—చాలమంది యీ ఔషధము నకలు చేయుచున్నారు. కనుక కొనునప్పుడు డబ్బాపైన రిజిష్టరు నంబరు నం ౭౫౭ ప్రభుత్వమువారి తాజానుజాచి కొనవలయును.

టెలిఫోన్ ౭౦౨

కార్ఖాన జిందా తిలిస్మాత్
కాచీగూడ, హైద్రాబాదు (దక్కన్)

Zinda Tilasmath

# ఆంధ్ర బ్యాంక్ లిమిటెడ్

స్థాపితము 1923

హెడ్ ఆఫీసు — మచిలీపట్టణము

బ్రాంచి — కాకినాడ

నెం 877 రెసిడెన్సీరోడ్డులో కొలది దినములలో బ్రాంచినొకదానిని స్థాపించుచున్నారు. అన్ని విధములైన బ్యాంకు వ్యవహారములు జరుప బడును.

కర్రెంటు ఎక్కౌంట్లు: రూ. 100. అంతకుపై మొత్తములతోను తెరువ వచ్చును. జనవరినుండి జూన్ వరకూ సం॥ నకు రూ. 2½%, జూలైనుండి డిశెంబరు వరకూ సం॥కు 2% చొప్పునను, నెలసరికసీసవు నిలువ మొత్తములపై వడ్డీయివ్వ బడును. హాలీ ఎక్కౌంట్లు మీద జూలైనుండి డిశెంబరుతో అంత్యమగు ఆరు నెలలకూ వడ్డీఇవ్వబడదు.

సేవింగ్సు బ్యాంకుఎక్కౌంట్లు: రూ. 5 తో తెరువవచ్చును. కల్దారు ఎక్కౌంట్లపై నూటికి సం॥ నకు 4½, హాలీఎక్కౌంట్లుపై నూటికి సం॥ నకు రూ. 4 చొప్పునను, ప్రతినెల 6 వ తేదీ మొదలుమూసాంతముల్లోనా, రూ. 3000 లకు మించక నిలువయుండు కసీసవు మొత్తములపై వడ్డీ ఇవ్వబడును.

ఫిక్సెడ్ డిపాజిట్లు: రూ 5000 వరకూ ఒక సంవత్సరమునకు ఇవ్వబడును. ఇంతకు మించిన మొత్తములకు గాని సంవత్సరముకన్న ఎక్కువ కాలము నిలువ యుంచబడు మొత్తములకు గాని ఇవ్వబడు రేట్లు వివరము, బ్యాంకునందు తెలుసుకొనవచ్చును.

బ్యాంకు ఆదివారము తప్ప ప్రతిదినము 9 గంటలు మొదలు 3 గంటలు } వరకు తెరచి
శనివారము 9 గంటలు మొదలు 1 గంట } యుండును.

డి. యస్. శాస్త్రి ఎ. సి. సర్ట్. ఎ. ఐ. బి. } రావుబహద్దూరు శిడింబి హనుమంతరావు పంతులు
సెక్రెటరీ } బి. ఏ., బి. యల్., మేనేజింగు డైరెక్టరు.

ఇతర వివరములకు:

**ఏజంటు**

ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్, హైదరాబాదు (దక్కన్)

# యంత్రరాజములు

మనపూర్వులు ఆయురారోగ్యైశ్వర్యముల హితార్థము యంత్రమంత్రౌషధాదులనుకల్పించి, యుండి గ్రహించి ఫలప్రదమైనది ఎల్లరకు తెలసిన విషయమే కావున ఈ.

(౧) గృహస్థాపనయంత్రము

ఇంటిలో పశ్చిమదిశకు స్థాపించిన ౧౦౦ సం॥ రములవరకు ఆయురారోగ్య, సంతాన, లక్ష్మి, కీర్తి మొదలగు అష్టైశ్వర్యములకున్న బలమునిచ్చును,

(౨) పంటఫలించు యంత్రము

చేనులో పశ్చిమదిశకుస్థాపించిన ౧౦ సంవత్సరముల వరకు సమస్తధాన్యములు సమృద్ధిగా ఫలించును వివరములు యంత్రములవెంట తెలుపబడును

యంత్రముల ప్రాణప్రతిష్ట వి. పి. ఖర్చులతో
౨ యంత్రములు రు ౩ లు ౪ యంత్రములు రు ౫ లు
౭ ” రు ౭ లు ౧౨ ” రు ౧౦లు

చిదిరెమఠం అడివయ్య హకీం
ఆయుర్వేదాలయం సంగారెడ్డి
మెదకు జిల్లా

# నూరెదక్కను హేరాయిలు

మిక్కిలి శ్రేష్టమయిన మనోహరమయిన సువాసనచే మెదడుకు చల్లదనమును కలిగించును మరియు వెంట్రుకలకు నలుపును మృదుత్వమును కాంతిని కలిగించును సీసా ౧ కి॥ అ. ౧౪

# ఓటో నూరెదక్కన్

దేశీయ విదేశీయ అత్తరు లన్నిటికి చక్రవర్తి వివిధములయిన ౨౭ రకముల సువాసనల సమ్మేళనము ప్రతిక్షణము నవీన సువాసనయందు మనస్సు నోలలాడించును మరియు నాలుగు దినములవరకు సువాసన కలిగించును.

వెల నగముబౌన్సు రు. ౨ పావు బౌన్సు రు ౧.౮.౦

BHAGWAN & Co
Perfumers Guljar House
HyderabadDn.

గోలకొండపత్రిక
ప్రమోదూతనామ సం॥ శ్రావణ శు॥ ౮
శనివారము

# సంధిప్రయత్నము

భారతస్వాతంత్ర్య సమరము నాలుగు నెలలే జరిగినను ప్రభుత్వమువారపుడే జాతీయ నాయకులతో సంప్రతించుటకు ప్రయత్నించుచున్నారు. రాజప్రతినిధియగు అర్విన్ ప్రభువుగారు మితవాదనాయక ప్రముఖులగు డాక్టరు సప్రూ, జయకరుగార్ల కేమి అభయమిచ్చిరో కాని వారిని మాత్రము మహాత్మాజీ, నెహ్రూపండితులతో ప్రస్తుత పరిస్థితులగూర్చి చర్చించి ఒడంబడిక కుదుర్చుటకై ఆజ్ఞాపించిరి. తదానుసారము వారు ఎరవాడా జైలునకును నైనితాలు జేలునకును వెడలి మహాత్మాజీ, నెహ్రూలను దర్శించిరి. ఒకరివద్దనుండి మరియొకరికి లేఖలను దెచ్చిరి. కాని కాంగ్రెసు నాయకులేమి సూచించిరో రహస్యముగ నుంచబడినది. ఇక మహాత్మాజీ వ్రాసియిచ్చిన పిదప జయకరుగారు రాజప్రతినిధిగారి వద్దకు చేరుదురు.

ఈసంధి ప్రయత్నమునకు గౌరవనీయులగు శ్రీనివాసశాస్త్రీగారు ప్రథమమున సూచించిరని నేటివార్తలవలన తెలియుచున్నది. వారు ఇంగ్లండునుండి గాంధీజీకి దీర్ఘ[illegible] తంతినంపిరట. దానిని ఒకరోజు పూర్తి ఆలోచించి గాంధీగారు తాము భగవత్ప్రేరణకై వేచియున్నామని జవాబు నిచ్చిరట. అందుపై శాస్త్రీగారు సప్రూ,జయకరుగార్లకు తెలిపిరట, దానిపై ఈ నాయకులు రాయబారమునకై ప్రయత్నించుటకు వైస్రాయిగారి వద్ద అనుజ్ఞబడసిరట.

గాంధీగారు గౌరవప్రదమగు సంధికైయెల్లప్పుడు సిద్ధముగనే యున్నారు. వారు లవణశాసన ధిక్కారమునకై పూనుకొనుటకు మున్ను అర్విన్ ప్రభువుగారికి దీర్ఘమగు లేఖ వ్రాసిరి. కాని ప్రభువుగారు దానిలో సూచించిన విషయములకెట్టి ప్రత్యుత్తరమొసగక శాసన ధిక్కారము వలన శాంతికి భంగము కలుగునని మాత్రమే వ్రాసిరి. మరియొకసారి మహాత్ముడు దర్శన ఉప్పుకొఠారుల పై దాడివెడలుటకు పూర్వము నొక లేఖ వ్రాసిరి. దానికికూడ తగు జవాబు దొరకలేదు. అందుచే లవణశాసన ధిక్కారమును, విదేశవస్త్రముల దుకాణములవద్దను, సారాదుకాణములవద్దను, సత్యాగ్రహమును జేయుటకు దేశీయులను ప్రోత్సాహపరచి తాము బంధీకృతులైరి. ఇపుడు వారికిని బ్రిటిషుప్రభుత్వమునకును, గౌరవ ప్రదమగుసంధి జరిగినచో వారెంతమాత్రమును నిరాకరించరు. వారు గత డిసెంబరు మాసమున వైస్రాయిగారితో డొమినియను ప్రతిపత్తిగూర్చి హామీ నివ్వవలయునని కోరిరి. వారెట్టి హామీ యివ్వనందున లాహోరు కాంగ్రెసునందు సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రకటించిరి. దీనివలన మహాత్మాజీ అన్ని విధముల రాజీకై ప్రయత్నించెనని విదితమగును. కొందఱు సత్యాగ్రహమును నిరసించుచు శాసనబద్ధమైన ప్రయత్నము చేయవలయునని కాంగ్రెసు వారికి జెప్పుదురు. పైన వివరించినవికాక వింకేమి చేయవలసియుండెనో మేమూహించ జాలకున్నాము.

అయినను గాంధీజీ డొమినియను ప్రతిపత్తికి అంగీకరించినను కాంగ్రెసు అధ్యక్షులగు పండిత జవహర్ లాలు నెహ్రూగారు దీనికి అంగీకరించరాయని సందియమున్నది. ఏలయన వీరు చెన్నపురి కాంగ్రెసు నాటినుండి సంపూర్ణ స్వాతంత్ర్యము ప్రకటించుచున్నారు. బ్రిటిషువారికి లోబడియుండుట వారికి సహించదు. భారతదేశము నందలియువజనులందరును, నిదే అభిప్రాయము కలిగియున్నారు. శాసన సభాధ్యక్షులగు విఠలభాయి పటేలుగారు సూచించినట్లు ఇప్పటిసంతతివారు డొమినియను ప్రతిపత్తి కంగీకరించినను భావి సంతతివారు బ్రిటిషువారి సంబంధము నెంతమాత్రము నుంచుకొనుటకు ఇష్టపడరు. కాలము మారుచున్నది. ప్రజల అభిప్రాయములు మారుచున్నవి. దేశాభిమానము ప్రబలుచున్నది. బ్రిటిషు వారి పరిపాలనముక్రింద దేశమునకు కలిగిన నష్టములు సర్వజనులకు తేటపడినవి. అట్టియెడ సంపూర్ణ స్వాతంత్ర్యము కోరుటలో చోద్యమేమి?

ఒక వైపు కాంగ్రెసు నాయక ప్రముఖులతో సంప్రతించుటకై ప్రయత్నము జరుగుచుండ వేరొక వైపు ప్రభుత్వమువారి నిర్బంధ విధానము దేశమంతటను వ్యాపించియే యున్నది. ఎందరో స్త్రీలు కారాగృహములకు చేరుచున్నారు. ఏమి తెలియని జనసమూహములపై లాఠీలు ప్రయోగింప బడుచునేయున్నవి. గాంధీటోపియు ఖద్దరు దుస్తులును ధరించుట నేరముగ పరిగణింపబడుచున్నది. ౧౪౪ సెక్షను దాదాపు ౧౦౦ స్థలములలో అమలు సందుంచబడినది. జాతీయాభిప్రాయములు వెలువడించు పత్రిక లెన్నియో అపుదలచేయ బడినవి. నిలచియున్నవాని నుండి వేనకువేలు ధరావతు కోరబడుచున్నవి. ప్రజల ప్రాథమిక హక్కులు లాగుకొన బడినవి. దీనికి తృప్తి జెందక ప్రభుత్వమువారు బొంబాయినందు విదేశవస్త్ర బహిష్కరణ తీవ్ర ప్రచారమును అరికట్టుటకు అచట సైనిక శాసనమును ప్రయోగింపనున్నారని పాయినీరు పత్రిక సిమ్లా విలేఖరి వ్రాయుచున్నాడు. పార్లమెంటు ప్రధానమంత్రియగు రామ్సె మెక్డనాలుగారు త్రిపక్ష ప్రాతినిధ్యమున కొప్పుకొనిరి. కాని సైమనుగారినేకాని, భారతకేంద్రసభా ప్రతినిధులనేకాని, రౌండుటేబిల్ సభయందు చేర్చరాదని సెలవిచ్చిరి. త్రిపక్ష ప్రాతినిధ్యముగూర్చి మితవాదనాయకులే ప్రతికూలురుగ నున్నారు. ఈ విషయమున చెమన్లాలు సెతల్వాడుగారు అర్విన్ ప్రభువునకు తంతినంపెను. తాము నాలోచించెదమని వారు జవాబు చెప్పిరి. కాని రాజప్రతినిధి ఆలోచనయందు మగ్నుడైయుండగనే పార్లమెంటునందీ విషయముగూర్చి పరిష్కారమైనది. ఇక రాజప్రతినిధిగారి ఉపన్యాసమునకు సంతుష్టిజెందిన మితవాదులేమార్గ మవలంబించెదరో చూడవలసియున్నది. వారికి కాంగ్రెసువారితో కలయుటకన్న వేరొకమార్గములేదు. అయినను మరల రాజప్రతినిధియేదేని యుపన్యాసము గావించిన సంతృప్తులై రౌండుటేబిల్ మహాసభలో పాల్గొనుటకు రాజీపడుదురో చూడవలయును. వీరు దేశీయుల ప్రతినిధులు కాజాలరని విఠలభాయిపటేలుగారు సూచించియున్నారు. వీరు పాల్గొనినంతనే భారత సమస్య పరిష్కారము కాజాలదు.

ఇంతియకాక స్వదేశసంస్థానాధీశుల రౌండుటేబిల్ సభగూర్చి చాల ఆతురత జూపుచున్నట్లు గన్పట్టుచున్నది. వీరు తమ తమ ప్రతినిధులను నెన్నుకొనిరి. అనేక చిన్న సంస్థానముల పక్షమున వాదించుటకు కొందఱు సంస్థానాధీశులు ఇంగ్లండునకు పయనమైరి. ఈ సంస్థానాధీశులలో అధికసంఖ్యాకులు చక్రవర్తి ప్రభుత్వమునకు లోబడియుండవలయునని ఇచ్ఛగించుచున్నారు. స్వదేశీయుల క్రింద నుండుట వారి ఆత్మగౌరవమునకు భంగమని తలంచుచున్నారు. బట్లరుకమిటి నివేదిక వీరిని సంతృప్తి పరచలేదు. వీరు తమ సంస్థానములలో నిరంకుశ ప్రభుత్వము బాగుగ చలాయించుటకు వీలుండవలయునని కోరుచున్నారు.

ఈ పరిస్థితులన్నియుబట్టిచూడ జరుగబోవు రౌండుటేబిల్ సమావేశమునందు బ్రిటిషు త్రిపక్ష సభ్యులును స్వదేశసంస్థానముల ప్రతినిధులును కలసి ఒక గుంపైయుండెదరని తెలియుచున్నది. బ్రిటిషువారు సైమను సంఘనివేదికకన్న ముందుకు పోరుగదా! స్వదేశసంస్థాన ప్రతినిధులు వారి అభిప్రాయములకే తలయూచెదరుకదా! ఇక జాతీయవాదుల అభిప్రాయములు అంగీకరించువారుండరాయని మాకు సంశయము కలదు. సైమను సంఘనివేదిక భారతదేశమందలి యేపక్షమువారును ఏజాతివారును, అంగీకరించనందున రౌండుటేబిల్ సభ మిషకల్పించి అందుదానినే ధృవపరచుటకు బ్రిటిష్‌వారు తలంచినట్లు ప్రస్తుత పరిస్థితులనుబట్టి దోచుచున్నది. వారి హృదయపరివర్తనము కలుగకుండుటయే దీనికి నిదర్శనము. అర్విన్ ప్రభువుగారు భారతీయులయెడ సద్భావము కలిగియున్నను వారేమియు చేయజాలరు. ప్రస్తుత మొక వారమునుండి కాంగ్రెసునాయక ప్రముఖులతో జరుగుచున్న రాయబారఫలితము ఈ వారములోనే ప్రకటింపబడగలదు. భారతదేశమునందు శాంతి నెలకొల్పబడుగాకయనియు, భారతీయుల ఆత్మగౌరవమునకు భంగము కలుగకుండ సంధి జరుగుగాకయనియు, మేము వాంఛించెదము.

పై వాక్యములు ముద్రింప బడినపిదప నేడు కాంగ్రెసు తాత్కాలిక అధ్యక్షులగు వల్లభభాయి పటేలుగారును, పండిత మదన మోహన మాలవ్యా మున్నగు వర్కింగు కమిటీ సభ్యులును, బొంబాయి నగరమున యూరేగింపు నడిపినందులకు శిక్షింప బడిరని తెలిసినది. ఇట్టి సమయములో జయకరు సప్రూ రాయబారము వలన సంధియగుననుట మిథ్య యనవచ్చును. ప్రభుత్వవారి పాలసీయందు పరివర్తనము కలుగనిది భారత దేశమునకు శాంతి సమకూరజాలదు. రౌండు టేబిలు సభలుబోలు ఎన్ని సభలు పట్టె బూటకములే. వీరి వలన యెట్టి లాభమును కలుగజాలదు. భారతీయులకు త్యాగమే శరణ్యము. సంగీతమునకు చింతకాయలు రాలునా?

---

### ఆం. రా. కార్యనిర్వాహక సభ

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గసమావేశము కర్నూలులో ఆగస్టు ౩౧ తేదివాడు జరుగును

### కాంగ్రెసు కార్యనిర్వాహక సభ

ఈ సమావేశము బొంబాయి నగరమున గురువారమునాడు సర్దారుపటేలుగారి యాజమాన్యమున జరిగినది. సమావేశము రహస్యముగ జరుగుచున్నది పత్రికావిలేఖరులు సభాచర్య వెలుపుమని యడుగ కార్యదర్శిగారు శాసన సభల ఎన్నికలకై నిలువరాదనియు, కాంగ్రెసువారు ప్రతినిధులు నిలిచినచో పికెటింగ్ సలుపవలయుననియు తీర్మానింపబడినదని తెలిపిరి।

### మెక్డనాల్డు ప్రసంగము

పార్లమెంటునందు ఇంగ్లండు ప్రధాన మంత్రులగు మెక్డనాలుగారు రౌండుటేబిల్ సభా ప్రతినిధుల గూర్చి మాట్లాడుచు బ్రిటిషు రాజకీయ పక్షములు మూడింటినుండి సభ్యులు నెన్నుకొన బడుదురనియు, ప్రతి పక్షమునుండి నలుగురు సభ్యులుండుదురనియు, సైమను సంఘముయొక్కయు భారత కేంద్రసంఘముయొక్కయు ప్రతినిధులు చేర్చబడరనియు తెలిపిరి. మరల ౩౦ తేదిన [illegible] సైమనుగారిని సభలో చేర్చుకొనుటకు కోరిరి. [illegible] మంత్రిగారు నిరాకరించిరి

## స్థానిక వార్తలు

### లోకమాన్య వర్థంతి

నిన్న సాయంత్రము న్యూఇడెన్బాలో పాండురంగ శాస్త్రి జోషీ వకీలుగారి భవనమున లోకమాన్య బాలగంగాధర తిలకుగారి వర్థంతి సలుపబడినది. రామచంద్ర నాయకు బాకేట్గా గ్రధ్యక్షులుగ నుండిరి.

### కాలిన్సుగారు

వీరు మరాట్వాడీ జిల్లాలలో టూరు చేయుటకు నిన్న రాత్రి వెడలిరి. ఆగస్టు నెల ౧౫ తేది వరకు తిరిగి వత్తురు.

### మోసము

న్యూఢిల్లీ లాంకులలో నొక కంపెని ఏజంటు పనిచేయుచుండిన నిబ్లెటు (Niblett) అను నతడు బెంగుళూరులో ౧౮ వేల రూపాయిలు మోసము చేసియుండుటచే అచట అరెస్టు చేయబడెను. ఈ నగరమున కూడ నవాబు జేనులాబుద్దీన్ ఖాన్ సా॥ వద్దనుండి కొన్ని బాండ్లు వసూలు చేసెనట. మంగళవారము నాడు సికింద్రాబాదు పోలీసువారు అరెస్టుచేసి కోయంబుత్తూరుకు తీసుక వెడలిరి. ఇతని విచారణ కోయంబుత్తూరునందు జరుగును.

### డా॥ సుహ్రావర్ది సా॥

వంగదేశ ముస్లిం నాయకులగు వీరు సోమవారము నాడిచటికి వచ్చియున్నారు. వీరు బేగంపేటయందు ప్రభుత్వమువారి అతిథిగా నున్నారు.

### ఆరునెలల వేతనము

ఆరునెలల ప్రత్యేక సెలవు పుచ్చుకొను అధికారులకు ఉపకార వేతనముపై తొలగిపోవు నపుడు ఒకేసారి ఆరునెలల వేతన మొసగుటకు అంగీకరింపబడినది.

### తుపాకులు వేయు ఆజ్ఞ

అవ్వాలు, దువ్వం తాలుకాదారులవలె తహసీల్దారులకు కూడ వారి యిలాకాలలో తుపాకులు వేయుటకు ఆజ్ఞ నొసంగుటకు మాలుశాఖవారంగీకరించిరి.

### పర్సనల్ అలవన్సు

సైనిక కార్యదర్శులగు నవాబు వలీ(జంగ్ బహదురుకు పనినుండి తొలగిన నరనుండి ౧౨౦౦ ల పర్సనల్ అలవన్సు నిచ్చుటకు ప్రభువుగారాజ్ఞాపించిరి. ఈ అలవన్సు మొత్తము వారికి రెసిడెన్సి ఇలాకాలో నున్న అప్పులు తీర్చుటకు గాను ఆర్థికశాఖద్వారా సాహుకారులకు నివ్వబడును. ఇంకను సాహుకారులకు హెచ్చు మొత్తమివ్వవలసి యున్నచో ఆర్థికశాఖనుండి ఆ మొత్తము అప్పుగానిచ్చి వీరికి ప్రతినెల యిచ్చు అలవన్సునుండి సగము ఈ అప్పుక్రిందికి రాబట్టుకొనబడును.

### ఫర్నిచరు

హైకోర్టునందలి ఫర్నిచరు కొరకు రు ౧౧౨౦౦ లు అంగీకరింపబడినవి.

### వరంగల్లు మునిసిపు

హమీదొద్దీన్ సా॥ కు షహరేవరు నెల పూర్తి సెలవు అంగీకరింప బడినది. వారి స్థానే ఉమ్మీదవారులగు సయ్యద్ బురహానొద్దీన్ సా॥ వకీలు పనిచేయుచున్నారు.

### మతశాఖ

ఈ శాఖయొక్క మదద్గారులగు సయ్యద్ మహమ్మద్ నక్వీసా॥కు ౧౩౩౯ ఫ. అంతమువరకు ఉద్యోగకాల పరిమితి హెచ్చింప బడినది.

### కోర్టు ఆఫ్ వార్డ్సు నాజంసా॥

వీరిపుడు మరాట్వాడీ జిల్లాలలో టూరు చేయుచున్నారు

### భాషాంతరీకరణశాఖ

ఈవిషయమున మా సమకాలిక పత్రికయగు "రహబరె దక్కన్" ఇట్లు వ్రాయుచున్నది:—

౧౩౩౭ ఫ భాషాంతరీకరణ శాఖానివేదిక వలన గత ౧౨ వత్సరములలో ౩౦౨ గ్రంథములు ఉర్దూభాషలో కనువదించబడినవని తెలియుచున్నది. వీనిలో ౧౫౭ పుస్తకములు మాత్రమే పూర్తియైనవి మిగత ౧౪౫ గ్రంథములు తర్జుమా యందును, ముద్రణయందును, ఉన్నవి. ఈశాఖకు ప్రభుత్వమువారు ౧౩౨౬ ఫ నుండి ౧౩౩౭ ఫ. వరకు రు ౯,౬౬,౯౭౮ లను, రు ౨,౪౯,౭౫౧ ప్రెస్సువకును, మొత్తము రు ౧౨,౧౬,౭౨౯ లు వ్యయపరచిరి. ఇంతఖర్చు అయినను ౧౫౭ గ్రంథములు సిద్ధమైనవి కాని పాత్రములు ముద్రణమందున్నవి. ఈ లెక్క ప్రకారము లాచిన పై ౩౦౨ గ్రంథములు పూర్తియగుటకు ౩౦ లక్షల రూపాయిలు వెచ్చింపవలసి యుండును. ఈ పుస్తకములలో చాలవరకు నిరుపయోగములుగ నున్నవి.

### వబ్బతి రామయ్యగారు

వ్యాకరణ శాస్త్రవ్యాఖ్యలు, వైశ్యకులజాలును వేదాంత, జ్యోతిష సర్వశాస్త్ర పారంగతులును. నగు శ్రీయుత వబ్బతి రామయ్య సిద్ధాంతులు విజయము చేసి కొన్ని దినములనుండియు సికింద్రాబాదు పాతబస్తీలు ఘాస్మండి వైశ్య పెద్దలనున్న శ్రీయుత పశ్యావాగయ్య శ్రేష్ఠిగారియింట ప్రస్తుతము స్త్రీలలో వేదాంత ప్రబోధము కలుగజేయుచున్నారు. గాన సికింద్రాబాదు వాస్తవ్యులలో శ్రీమంతులు గాని, దక్షిణ వైశ్యసంఘము వారు గాని యీయూర వైశ్యకోచేరి పత్రిక భవనమునందు కొన్ని యుపన్యాసముల భగవద్గీతయందును వేద విషయమునను యిప్పించుటకై ఒకరు సికింద్రాబాదువారికి విన్నవించుచు మాకు వ్రాసియున్నారు.

### ఉపహారవిందు

నగర న్యాయవాదుల పక్షమున ఉపకార వేతనము పొందిన నవాబు అగాయార్జంగ్ బహదురకు నిన్న సాయంత్రము ౫ గంటలకు నర్సింగ్జీ కోఠియందు ఉపహారవిందొసగబడెను, మహారాజా కృష్ణప్రసాదు గారును ఇతర అధికార అనధికార ప్రముఖులును వచ్చి యుండిరి. ఉపాహారములు తినిన పిదప మౌల్వీ ఫైజొద్దీన్ వకీలు సా॥ ఆగాసా॥ గుణగణములను ప్రశంసించిరి, దానికి ప్రత్యుత్తర మిచ్చుచు ఆగాసా॥ తాము మొదట ౧౨ సంవత్సరములు జిల్లా పోలీసు శాఖయందు పనిచేసితిమనియు, అనంతరము మాలు శాఖకు మార్చబడితి మనియు, తెలిపిరి వీరలయెడ కనికరము జూపెడి వారమనియు తెలుపుచు అందుకు కొన్ని నిదర్శనములను చెప్పిరి. అనంతరము మహారాజా బహదురు నవాబు సా॥ కు పూలహారమువేసిరి అంతటితో సభ ముగిసెను. వీరికి మాలుశాఖా మంత్రులు రు ౯౫౦ ఉపకార వేతనమియ్య సూచించిరట కాని నిజాం ప్రభువుగారు రు ౧౧౦౦ నిచ్చుట కొప్పుకొనిరట.

జ్ఞారపించిరట.

### ఓహరాగారు

కాప్టెన్ జె. ఏ. కె. ఓహరాగారు స్టేషన్ ట్రాన్సుఫోర్టు ఆఫీసరుగ నియమింప బడిరి.

### సెలవు

సికింద్రాబాదు జిల్లాపోలీసు సుపరింటెండెంటులగు ఎఫ్. జె. రెటు గారు ఎనిమిది మాసముల సెలవుపై ఇంగ్లండునకు వెడలిరి. వీరి స్థానమున వెకహాం (Weck ham) గారును. వీరి బదులుగ గిల్బర్టుగారు పని చేయుదురు. సర్కిల్ ఇన్స్పెక్టరులగు హఫీజుల్లాఖాన్ సా॥ ధృవపరచబడిరి.

### గ్రేడు

న్యాయ పోలీసు శాఖల మంత్రిగారు మూడవతరగతి గ్రేడులలో దిగువ మార్పులు గావించుటకై వ్రాసిరి. కార్యదర్శులు రు ౪౦ నుండి ౭౦ వరకు బదులు రు ౫౦ నుండి ౧౦౦ వరకు అధ్యక్షులు రు ౩౦ నుండి ౭౦ వరకు బదులు రు ౪౦ నుండి ౭౦ వరకు

### నర్సింగరావుగారు

రయ్యత్ పత్రికా సంపాదకులుగ నుండిన ఎం నర్సింగరావుగారు కాలుగు రోజులక్రింద క్షయవ్యాధిచే పీడింపబడుచున్నందున మదనపల్లికి పోయిరి.,

### గ్రేడు నిర్ధారణ,

ప్రధాన మంత్రిగారి యాజ్ఞచే వైద్య కళాశాల డెమానిస్ట్రేటర్లకు, అసిస్టెంటు సర్జనుల వేతనము నొసగుటకును, రు ౨౫ అలౌన్సు ఇచ్చుటకును, మదద్గారు ప్రొఫెసర్లకు రు ౩౫౦ నుండి ౭౦౦ లు వేతనము నొసగుటకును మంజూరియైనది

### తుంగభద్ర నీటి తగాదా

తుంగభద్ర నీటి విషయమై చాలా కాలమునుండి మదరాసు ప్రభుత్వమునకును, నైజాం ప్రభుత్వమునకును తగాదా జరుగుచుండెను. అందుచే డాక్టరు మాసంగారు ఈ విషయమైన "తుంగభద్రా నది పరిసర ప్రాంతము నల్లభూమి యనియును ఇందులో ప్రత్తి పండునదనియు, తుంగభద్రానది నీటిచే నీటి భూములు లాభము పొందజాలవనియు అభిప్రాయ మొసగిరి.

ప్రభుత్వసభ గత సమావేశమునందు ఈ విషయమున చర్చ జరిగెను. కామిరాబు, అప్పాషి, చీఫు ఇంజనీరులను కార్యదర్శులను అగు నవాబు అలీ నవాజ్జంగు బహదురు సర్కారువారు తుంగభద్రానది నీటిని తీసికొనవలయునని ధృవపరచుచు నొకగంట కాలము వరకును గంభీరోపన్యాస మొనర్చిరి. అందు తుంగభద్రానదినీటినితీసికొనుటను గూర్చి నడుపుచు రాయచూరునందలి దోఆబు ప్రదేశమునందు ఈ నీటిచే చాలవరకు లాభము పొందవచ్చు ననియు కొంత వరకు యీ నీటిచే పైరుచేయుటకు లాభము కలుగకున్నను, విద్యుచ్ఛక్తి నుత్పత్తి జేసి దాని వలన దేశమునకు అపార లాభము కలుగజేయవచ్చు ననియు, నుడివిరి ఇందుపై ప్రభుత్వ సభవారు దిగువ సభ్యులు గల యొక కమిషన్ నేర్పాటు చేసిరి. అలీ నవాజుజంగు, ఆర్థికశాఖా కార్యదర్శులగు మఖదుమ యార్జంగు, భూమ్యాదాయ శాఖా కార్యదర్శులగు మిస్టరు టాస్కరు, వ్యవసాయ, వాణిజ్యశాఖల అధ్యక్షులగు మిస్టరు బి. ఎ. కాలిన్సు గార్లను నియమించి. వారలకు ఈ విషయమున తగు ఆలోచన సలిపి, ఒక వారము లోపల నివేదిక ప్రభుత్వ సభయందు సమర్పించుటకు ఆజ్ఞ ప్రసాదించిరి. ఈ విషయమునవే నిన్న కామిరాబు అప్పాషి కార్యదర్శి కార్యాలయమున మొదటి సమావేశము జరిగెను.

### మానవ ధర్మములు

బుధవారము నాడు నిజాం కాలేజునందు తమిళ భాషాధ్యాపకులగు ఎ.వి. నారాయణస్వామి అయ్యరుగారు ఎం. ఏ. మానవధర్మముల గూర్చి యుపన్యసించిరి. వీరు మనుజుడు పరమేశ్వరునియందు లీనమగుటయే యుద్దేశమనియు, మనుష్యునికిని జంతువులకును మూడు విధముల భేదమున్నదనియు, ఒకటి విచారణ శక్తియు, రెండవది వాదనా శక్తి, ఇచ్ఛాశక్తి, అనియు నుడివిరి,

### ప్రెస్ ఫోటో సర్వీసు

డి. జగన్నాధరావుగారు ప్రెస్ ఫోటో సర్వీసును స్థాపించి యున్నారు. వీరు భారత దేశమునందలి పత్రికలకు హైదరాబాదు ఫోటోలను పంపుదురు.

### అధికారము

వ్యవసాయశాఖ యుద్యోగులలో రు ౨౫౦ నుండి రు ౪౦౦ గ్రేడు గల వారికి సెలవులను ప్రసాదించుటకును, తాత్కాలిక నియామకముల గూర్చియు, ప్రధానమంత్రిగారికధికార మొసగుచు ప్రభువుగారనుజ్ఞ ప్రసాదించిరి,

### ఫర్నిచర్

ఉస్మానియా కళాశాల ఉపాధ్యక్షుల కార్యాలయమునకు ఫర్నిచరు కొనుటకు గాను, రు ౧౬౭౫ లు మంజూరి ఒసగబడెను.

### సైటర్ సత్యాగ్రహులు

సైటను నుండి హైదరాబాదుకు వచ్చిన సత్యాగ్రహులు తిరిగి తమ స్వస్థానమునకు వెడలిరని తెలియుచున్నది.

## పశుబలమును: పాశుపతము

ఎ. సీతారాం రావుగారు

ఆత్మజ్ఞానముగల మనుజులు జీవనువిత్యమను విషయమును మెరింగియేయుందురు. ఆత్మగౌరవమును కాపాడుకొనుటయే నిజముగు ప్రపంచ యాత్రయని తలంచుదురు. అట్టిగౌరవము భంగపరచు విషయములు ప్రపంచమందెట్టుల పుట్టినను, యెవరు కలుగజేసినను సహించుట దుర్లభముగా యుండును. ఆత్మజ్ఞానములేని ప్రభువు మరియు దాని ప్రభుత్వము జ్ఞానోత్తములెల్లరిని అజ్ఞానవ్యక్తులని తలంతురు. అట్టి ప్రభువునకు హితము చెవికెక్కునా! ఎక్కదు. తము నడవడికయే సహార్థమని తలంతురు. జ్ఞానసంపన్నుల సద్భావమును వారలొనర్చు లోక కల్యాణ కార్యములను క్రూర కృత్యములుగా గాన్పింపుచు, దాని నణచుటకు పశుబలము నుపయోగించ నెంచెదరు, అట్టి పశుబలము ఎప్పటికైన దుర్బలమేయని గుర్తెరిగిన ఆత్మజ్ఞానులు తౌటాకుల చప్పుళ్లకు కుందేళ్లు భయపడునా అను సామితగా భయపడుదురా! భయపడరనియు, „జాతస్య మరణం ధృవం యని" దీకొందురనియు తెలిసినసంగతియే: జ్ఞానులు పరమునకైయే ఇహమున తమవిధికర్మనాచరింతురు, అట్టి వారికి మృత్యువన్న నిర్భయమేకదా! విధికర్మ నిరాటంకముగ అచరించునపుడు అభ్యంతరములు వాటిల్లినప్పుడెల్ల ఆత్మగౌరవమునకు హాని సంభవించును. అత్మజ్ఞానముగల మనుజులు సహింపక యాతురపడుదురు. లేనిచో యట్టివారికికూడ పరముపై ప్రీతి తప్పుటయేగాక రానురాను నశించును. ద్విపాద పశువైన పశుకర్మనే ప్రేమించ దొడగుదురు. అచరణలోనికికూడ దెత్తురు. అట్టిజ్ఞానమును గోల్పోయినవారికి మృత్యువన్న ఎప్పటికి భయమేకదా! జైలన్న జంకు. పశుబలమే పారమార్థికమని సాధింతురు, జీవన్మృతులై కాలము గడుపుచుందురు.

అత్మజ్ఞానము లేనిప్రభువు ప్రభుత్వము తమ స్వార్థమునకే „లా" యని నామమిడుదురు. అందులకు లోబడినగౌరవహీనులందరు అదే „లా"ననుసరించి జన్మయాత్ర గడుపవలసియుండునుకదా?

అత్మజ్ఞానము గలిగి త్యాగులై పారమార్థిక ప్రతింబు బూనినవారుకూడ స్వార్థమునే [లా] న్యాయ మనవలయునట. దాని ననుసరించి నడువవలయునట. స్వార్థముచే కలుగు కష్టనష్టము లు లెక్కింపగూడదట. ఇతరులకు బోధింపగూడదట. ఇట్టి విచిత్ర ప్రభుత్వమందు జీవించియుండుటకంటె మరణము మేలని ఆత్మగౌరవమును కాపాడుకొన దలచిన స్వార్థత్యాగులు ప్రపంచమందెన్ని యిక్కట్టు లొచ్చినను సహించెదరు. ఈత్యాగమే పశబలమును ప్రయోగించు ప్రభుత్వమును దీకొను శక్తి సామర్థ్యము లిచ్చును. ఈ శక్తి తనంతటతానే యెల్లెడల వ్యాపించి స్వార్థపరాయణులను కూడ త్యాగులనజేయును. ఆత్మజ్ఞాన సంపన్నుల గౌరవమును అభిమానమును కాపాడుకోగల శక్తి నుద్భవింపజేయును. అప్పుడు మరణమన విర్లక్ష్యము గర్వము అహింసా తత్వమునందు నిండునమ్మకము కలుగును, దీనిచే పశుబలము పలాయనమ్మాత్రము జెప్పుకొనును గనుక భారత సోదర సోదరీమణులార తమతమ యాత్మజ్ఞానముచే గౌరవము నిలుపుకొనుటకై ప్రస్తుత మన హిందూ దేశీయుల ధర్మ యుద్ధంబునందు పాల్గొని పశుబలమును జ్ఞానబలముచే దీకొని మన దేశమునుండి పారదోల సమకట్టుడు. నడుంకట్టుడు.

## కాంగ్రెసు మిల్లుబట్టలకు ప్రతికూలమా!

పటేలుగారు బహిష్కారోద్యమమును వివరించుట

సర్ పురుషోత్తమ దాసు ఠాకుర్దాసుగారు కాంగ్రెసు తాత్కాలికాధ్యక్షులగు వల్లభ భాయి పటేలు గారికి వస్త్రవ్యాపార పరిస్థితుల గూర్చియు, బొంబాయి వర్తకుల నిశ్చయము గూర్చియు, వివరించుచు కాంగ్రెసు మిల్లు బట్టలకు కూడ ప్రతికూలముగ నున్నదా అని లేఖవ్రాసిరి, దానికి పటేలుగారు దిగువ జవాబు నిచ్చిరి:—

నేను బొంబాయి వస్త్ర మార్కెటు పూర్తిగ మూసివేయుటకు నెంతమాత్రము అనుకూలుడగాను. ఇవి రాజకీయోద్యమమున కనవసరమని నాయభిప్రాయము, కాంగ్రెసు విదేశ వస్త్రముల దిగుమతియు, దాని విక్రయమును, నాప యుద్దేశించినది, నాకు దెలిసినంత మట్టుకుబొంబాయి రాష్ట్రీయ కాంగ్రెసుకూడ మిల్లు బట్టల నమ్ముటకు వ్యతిరేకముగ లేదు, కాంగ్రెసు బొంబాయి వస్త్రవ్యాపారము నాపదలచినట్లు ప్రజలలో అభిప్రాయ మెట్లు కలిగినదో తెలియదు, ఈ అభిప్రాయమును తొలిగించ వలయును.

## మీకు సౌఖ్యము కావలెనా?

ఈ ప్రపంచములో ప్రతి మానవుడును సంతోషముగ నుండవలెనని కోరు కొను చుండును నిజముగా సౌఖ్యమును పొందవలెనంటే మనము ఆరోగ్యముగా నుండవలెను. అట్టి ఆరోగ్యమునకై

### ఆతంక నిగ్రహ మాత్రలు

వాడుడు. వేనవేలు ప్రజలుకూడ సౌఖ్యము ననుభవించు చున్నారు. ఒక సారి వాడిమాచినగాని మీకు బోధ పడదు. ౩౨ మాత్రలుగల డబ్బీ ౧ కి ౧-౦-౦ వివరములకు ఉచితముగా పంప బడు మా పుస్తకమును చూడుడు

దొరకు చోటు:—

ఆతంక నిగ్రహ ఫార్మసీ

౨౩ బ్రాడ్వే మద్రాసు.

ఏజంటు:—N. పద్మనాభం.

[illegible]

## ఆంధ్ర బుక్కు డిపో

| | |
|---|---|
| గృహలక్ష్మీ సచిత్ర మాసపత్రిక సం॥ చం॥ | 4-12-0 |
| సుజాత అర్ధవారపత్రిక సం॥ చందా | 6-15-0 |
| ఆంధ్ర వారపత్రిక సం॥ చందా | 4-12-0 |
| పశువైద్య వస్తుగుణదీపిక. | 2-8-0 |
| హిందూలా, ధర్మశాస్త్రము. | 7-8-0 |
| విశ్వానుసంధానము టీకాతాత్పర్యము. | 5-0-0 |
| కులశేఖరంబాలభారతీసమాజ సావిత్రి | 1-0-0 |
| ఆత్మకథ మహాత్మా గాంధీగారి జీవితము | 1-0-0 |
| ఆంధ్ర భగవద్గీత, శ్రీ సోమనాథరావుగారి కృతము | 1-3-0 |

సమస్త గ్రంథములును దొరకును. పుస్తకములను వి. పి గా పంపగోరువారు పావు మైకము ముందుగ మనియార్డరు ద్వార పంపవలెను పుస్తకములకు వ్రాయువారు జవాబు కార్డు పంపవలయును.

నా. గౌరీశంకరవర్మ అండు కో

5-86 రసిడెన్సి, పెద్దగడియారం శాశస్థ దగ్గర

హైదరాబాదు (దక్కన్)



## క్రొత్త విత్తనములు

పలు విధములైన కూరగాయల పుష్ప విత్తనము లమ్మెదు . మరియు తోటల గురించిసలహా నిచ్చెదము. ధరల పట్టిక ఉచితముగా పంపబడును

[illegible] ఆర్. సిద్ధరామయ్య ఎఫ్. ఆర్. ఎచ్. ఎస్. (లండన్)

[illegible]ట వ్యవసాయ నిపుణుడు. ది. హాయినిరు హార్టికల్చరల్, [illegible]ట్యూట్ ౧౫ రసిడెన్సి పెద్దబొలీసు స్టేషన్ వద్ద

హైదరాబాదు దక్కన్

## కావలెను

తెనుగు చక్కగా కంపోజు చేయగల కంపోజిటర్లు కావలయును. వెంటనే వివరములకై [illegible] [illegible]ది విలాసమునకు వ్రాయుడు.

గోలకొండ ముద్రాక్షరశాల

త్రూపు బజారు,

హైదరాబాదు దక్కన్.

## WANTED,

Candidates desiring to serve in Govern-[illegible]nt, Railway and Canal Departments, Full [illegible]rticulars on two annas stamp.

Apply to:—

[illegible]perial Telegraph College, Nai-Sarak,

Delhi

## సెంట్రల్ బాంకు ఆఫ్ ఇండియా (లిమిటెడు)

హెడ్ ఆఫీసు:—బొంబాయి ఇండియా యందలి ప్రతి ముఖ్యపట్టణములలో శాఖలుగలవు.

స్థానిక శాఖలు:—హైద్రాబాద, సికింద్రాబాద

కర్రెంటు డిపాజిట్స్:—లెక్కలు కల్దారు, రూపాయలలోను హాలీరొక్కముల యందును వ్రాయబడి యున్నవి. చెల్లుబడి మరియు మిత్తయి ఇవ్వబడును. ఎవరైనను రెండు నాణెములయందును లెక్కలుంచు కొనవచ్చును. సేవింగు బ్యాంకు డిపాజిట్స్:—

లెక్కలు కల్దారు, రూపాయలయందును హాలి రొక్కముల యందునుఉండును. వడ్డీ నూటికి సంవత్సరమునకు ౩½ రూప్యములివ్వబడును. చెల్లుబడి మొత్తమునకు సం॥నకు నూటికి 4 రూ. వడ్డీ ఎవరైనా రెండు నాణెముల యందును లెక్కలుంచుకొనవచ్చును.

ఫిక్సెడ్ పాస్టు డిపాజిట్స్:—

నిలువ బెట్టబోవు మొత్తములు ఎల్లప్పటికైనను లేక కొంతకాలము నకైనను నుంచుకొనవలసినచో ను ఉంచుకొనబడును. ఇవి రెండు విధముల నాణెముల యందుండవచ్చును. వీని వడ్డీ బాబతులు కంపెనీకి వ్రాసి తెలుసుకొనవచ్చును

లోన్సు, ఓవర్ డ్రాఫ్ట్సు, క్యాష్ క్రెడిట్లు:

తగిన జమానతు మీద అందరికి తగిన వడ్డీ ప్రకారమివ్వబడును.

స్టర్లింగ్ డ్రాఫ్ట్సు టెలిగ్రాఫిక్ ట్రాన్స్ఫర్స్: నేరుగా హైద్రాబాద నుండి యివ్వ్యా చేయబడును.

బంగారుకడ్డీలు: 10 తులములు లేక 5 తులముల బరువు కలవియు చక్రవర్తిగారిముద్ర మార్కుగలవి అమ్మబడును.

సేఫ్ డిపాజిట్: ముద్రవేసిన పంపిన పైకమును జమానతులును జగ్రత్తగానుంచుట కొరకు ఒప్పుకొనబడును. వాని మీద వడ్డీ రాబట్టబడును. ప్రతి విధమైన బ్యాంకు కార్యము జరుప బడును.

## ప్రకటన

పలువిధములైన చీని సామానులు,కట్టె సామానులు, గ్రాసు సామానులు బల్లలు, కుర్చీలు మొదలగునవి కాకయితర వస్తువుల వేలము వేయునేర్పాటు చేసినారము. ఇంతియేగాక తోటలు, ఇండ్లు, మున్నగు వాటిని విక్రయించి ఇవ్వగలము. పలువురు కోరుటచేవారి సౌకర్యార్థమై రెసిడెన్సీ రోడ్డులోని సాహెబు బ్రదర్సు మోటారుఏజంట్ల గృహమువద్ద, అనగా ఎక్సెల్సి యర్ సినిమా సమీపమున మాశాఖ నేర్పాటు చేసినారము. పలురకముల సామానులు కొనదలచినచో మా ఆఫీసునకు దయచేయుడు.

రహీమ్‌బక్షుఖాన్ అండు కంపెనీ

8-6.30 సైఫాబాదు, రెసిడెన్సి హైద్రాబాద దక్కన్ Rahim Baksh Khan & Co
17-7-31

## దక్కన్ హెయిరాయిల్ కంపెనీ హైదరాబాదు

దేశమునందు తలనూనెల జేయ ప్రారంభించిన పరిశ్రమాలయ మిదియే మొట్ట మొదటిది.

ఈ పరిశ్రమాలయము నుండి వస్తువులు తయారు చేయబడినవి.

దక్కన్ హేరాయిల్ రు ౧ నూరె దక్కన్ హేరాయిల్ ౹ ౧౩ కాంత హేరాయిల్ రు ౧-౮-. దక్కన్ బ్రిల్లియంటాయిన్ ౦-౧౨-౦. ఓటో దక్కన్ ఔన్సు ౧-౮-౦.

[illegible] దేశీయ అత్తరు ౧ ఔన్సు ౧ రు నానా దేశీయఅత్తరు ౧/౨ ఔన్సు ౨ ౹. పల్లెపూవుల దేశీయ అత్తరు ౧/౨ ఔన్సు ౹ ౨ పటవేళ్ల దేశీఅత్తరు ౧/౨ ఔన్సు ౹ ౨ [illegible]

[illegible] ఇంగ్లీషు ౧ ఔన్సు రు ౨ సెంటు జాస్మిన్ ఇంగ్లీషు ౧ ఔన్సు రు ౨.

మా కంపెని వస్తువులు కొనునప్పుడు ప్యాకింగు, లేబిలుపై మా కంపెనిపేరు లేక మామార్కు చూచికొనుడు. పరిశ్రమాలయము నుండియు గూడా ఆర్డరుల సప్లయి చేయబడును. **DECCAN HAIR OIL**

మా వద్ద హార్మోనియములు క్యామరాలు గడియారములు, గ్రామఫోనులు, రికార్డులు, తదితర వస్తువులు, ఫొటోగ్రాఫ్ సామానులు మొదలగునవి చౌక ధరలకే లభించును.

బి. జి. చిమల్‌గీకర్ గౌలిగూడెం పుత్లిబావి హైద్రాబాదు

## సిద్ధమైనవి

క్రొత్త కుబూలియ్యతులు

౧౦౦ కి రు ౩-౦-౦ లు

ఇదివరలో ఆర్డరిచ్చినవారికెలందకుండా యెగిరిపోయినవి. వెంటనే ఆర్డరిచ్చినగాని చిక్కవు.

గోలకొండ ప్రెస్, హైద్రాబాదు

## మీరుచదివినారా?

| | |
|---|---|
| ౧ వైశ్యకుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౮-౦ |
| ౩ పంచముల చరిత్ర | ౦-౪-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౪-౦ |

లేకున్న నేడే తెప్పించుకొనుడు.

ఈ నాలుగు గ్రంధములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీడికంటి రామశేషయ్య ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ ... వ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములు ఉచితముగ నివ్వబడును. తపాల ఖర్చు వేరు.

గోలకొండ పత్రికా కార్యాలయము
(త్రూపు బజారు హైదరాబాదు (దక్కన్)



## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

1 బి. ఎస్. సెట్టి అండు కో రెసిడెన్సీబజారు
2 నా. నాగేంశరవర్మ ,,
3 ... బి పురోహిత్ ,,
4 కే. లూకా. మెహతా, షహరు మసీదు ఎదుట } గౌలిగూడ

సికింద్రాబాదు

1 ... నారాయణ మార్కెటు బజారు





## గోలకొండ పత్రిక

త్రూపు బజారు హైదరాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | |
|---|---|
| | రు. ౭-౦-౦ |
| అర్ధ ,, | ౩-౧౨-౦ |
| విడి పత్రిక | ౦-౧-౪ |

...ed and Published by G. Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy.